# గేయగుచ్ఛము

మ. రా. రా. శ్రీ

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

యం. ఏ. బి. యల్. గారి

తొలిపలుకుతో



రచయిత:


సబ్నివీసు గురునాథరావు,

పెరుమాళ్ళపల్లి,

వినుకొండ పోస్టు, గుంటూరు జిల్లా.

*

నా తండ్రిగారు

కీ. శే.

# సబ్నివీసు హనుమంతరావు

పంతులుగారిపై

నాకుగల భక్తిచిహ్నముగా

అంకితము

*

# తొలిపలుకు

కవిత్వమున ముఖ్యమైన లక్షణములు మూఁడుకలవు. మానస నయనమున కెదుట రమ్యమైన దృశ్యములను చిత్రించు టొకటి; హృద్వీణను మీటి, రహిమీర విమలగాంధర్వమును వెలారించు టింకొకటి; భాస్వదాశయముల నంతరంగమున తళుక్కొత్తించుట వేఱొకటి. నైసర్గిక ప్రతిభాసమన్వితుఁడై వీనిని హృదయంగమ మొనరించుకొని, ఆత్మానుభవము నుండి గణయతులను పొందుగొనరించుకొని, హృద్యమైన పద్యములను, తీయనైన గేయములను సృష్టించు నాతఁడే నిక్కంపుకవి కాఁగలఁడు. వీని జీవనమును గంగాభవాని గావించునది ఈ యనుభవమే! ఇదియే మహత్తరకవిత్వమునకు కన్నతల్లియగును. 'సకల సద్గుణ నికురంబ' యనికదా శ్రీనాథుఁడు శారదాంబను ప్రస్తుతించినాఁడు! గుణమణిస్థగిత జీవనమే వాణికి ప్రతిరూపము కాఁజాలును. మహిమోపేతజీవియే మహాకవి కాఁగలఁడు. పంకిలము నుండి సంఘము నుద్ధరించి, మనుష్యహృదయమున నీశ్వరసామ్రాజ్యమును స్థాపించఁగలవాఁ డీతఁడే!

గాంధియుగమున నుత్తమాశయము లెన్నో చుక్కగుంపువలె భారత మానస దిగ్వలయమున కాంతిలినవి. ఈ కాంతి నాత్మజీవనములందు నింపుకొని, నవజీవన సందేశమును కీర్తించిన ప్రతిభాశాలులు కొందఱు మన నేలయందు తోఁచిరి. వీరిలో నీగ్రంథకర్త యొకరు. కావుననే వీరిగేయములు గంభీరభావబంధురములై సౌందర్యమాధుర్యములకు నిధానములై యొప్పుచున్నవి. సేవామహత్త్వము, దేశభక్తి, దైవభక్తి, ప్రేమశక్తి, స్వయంకృషి, ప్రాచీనమహాత్మ్యము, సారస్వతసేవ, జాతీయత్వము, అంతర్జాతీయత్వము, మానవభ్రాతృత్వము మున్నగు మహోన్నతాశయముల నివి యుద్బోధించుచున్నవి. "భరతమాత" "గాంధి" "పశ్చాత్తాపము" "మతము" "మహా

త్మ్ముఁడు" "దేశోద్ధారకుఁడు" "కాంగ్రెసుపతాకము" "మహాత్ముని సందేశము" మొదలైన గేయములు దేశీయుల నిత్యజీవనమున మంగళగీతికలు కాఁజాలునవి. నూతన భావోద్యమమున బోరుకలంగు ఆవేశసంభరిత సంకీర్తనము ప్రజాహృదయమున అద్భుత ప్రతిధ్వనులు లేపునుగదా! వీని కతన నిదురించుశక్తులు తలలెత్తును; తాత్వికులకు అంతరంగిక పరివర్తనము పొడసూపును; ఆత్మగౌరవమునుండి దిగజారి, స్వాతంత్ర్యమునుండితూలిపడి, సగము చచ్చిన జాతి నూతన జీవన మందును. గేయమును కనినహృదయము ధ్వనిగర్భితమైన పేటికకాదు. మానవాభ్యుదయము నానఁగూర్చు మధుర భావప్లావిత బృందావనము.

వనమాలిని గోపిక బృందావనమునఁ గలియు లీల, గేయమున గానమును కవిత కలియును. గుర్తుపట్టఁగలవారి కందు ప్రణయ సంశ్లేష మగపడును. రాసక్రీడ దృగ్గోచరమగును. అందుండి పొంగి పొరలు మంజుల రవములు మనసున రససింధువును పుట్టించును.

మధురనినదములు మృదులపదపుంజమునుండి వెడలును. గేయ మిట్టి పుంజము. ఇది బహుగుణాన్విత సాహితీశాఖ. చారుపల్లవముల కుప్పనుండి గుప్పునవిప్పొంగు సౌరభమట్లు లలితపదవిలసితపంక్తినుండి తేటమాటల పాటనుండి హాయినిచ్చు భావవీచిక బయలుదేరును.

జనసామాన్యము నవలీలగ చేరఁజాలునది కావున, ప్రజాహృదినుత్తాల భావతరంగములఁ బొరలించునది కావున, ప్రపంచసారస్వతమున గేయమే తొలుత శిరమెత్తినది. నేఁడును అన్యభాషలందు గేయము తనతొంటి ప్రశస్తిని గోలుపడలేదు. తేనెసోనల నూరించు తెలుఁగుకంటె క్లిష్టపదసంకుల సంస్కృతమే శతాబ్దములనుండి మనసాగస్వతోపాసకులకు నిలువేలుపు యగుటచే గేయవాఙ్మయము ఆదరమందక కుంటుబడినది. దీనిని పునరుద్ధరించు నవకవులు తెలుగుసాహితి కెంతో మేలుచేతురు.

తానేడ ప్రజలేడ యని నిరంకుశప్రభువువలె గద్దెనుండి హుంక రించు సాహితికి నేటివసుమతియందు చోటులేదు. "వర్డ్స్‌వర్త్" ప్రభృతి కవులను వలె గురునాధరావుగారు మున్నగు అధునికకవులను ప్రకృతి యును, సామాన్యమానవ జీవనమును గూడ నాకర్షించినవి. రాజకీయ సాంఘికరంగముల నుండి జలజలరాలు ఆశయములకు మాత్రమే మనసు లొగ్గి మిన్నకొనియుండక ప్రకృతిపై కన్నువేసి, దాని కరుణకతన వీరు తనివార భావామృతమును క్రోలి, రసపూరిత హృదయులైరి. రససంసిక్త వాక్కులెన్నో,— గంథకర్త భావనాశక్తిని ప్రకటించు మాట లెన్నో— ఇందుఁ గాన నగును. సౌందర్య సృష్టిని గావించున దీశక్తియే! పలు తెఱగుల కైసేఁతలం దాత్మప్రకాశ మొనరించుకొను సౌందర్యతిలకవలె, సౌందర్య సందీప్తాలంకారములందు కవిభావము తన్ను దాను వ్యక్తపఱచు కొనును. సహస్రమయూఖుని ప్రభావము తెలుపుటకు చక్కనైన కిరణ మొక్కటియే చాలులీల కవిహృదయ మహత్త్వమును, కవిసృష్టి శక్తిని తెలుపుట కొక సహజాలంకారమేచాలును. అలంకారము రంగుల కల యికయే కాదు. సాంధ్యరాగములను విలోకింపుడు. అందు భావబ్రహ్మాం డము దివ్యడింభకమట్లు తేజరిల్లు టెఱుఁగమా? అలంకారముల ఆదిమాత ఉపమ. ఈకవి కనిన ఉపమాలంకారముల నుపలక్షింపుఁడు.

"ఆకాశమును బోలు - అయంత రంగము"

"మంచుగడ్డావంటి - మచ్చలేనీమనసు

సూర్యకిరణము వలెను - సూటితప్పని నడత"

"పూవులో తావివలె - పెంపుమీరాలి

పాలలోనీళ్లవలె - కలిసిపోవాలి"

"మాటలోధ్వనివలెను - మెలగుచుండాలి

మీగడలోజిడ్డువలె - మిళితమవ్వాలి"

సుందరభావములు సుందరదృశ్యము లందును, చక్కనిచక్కబోలు శైలియందునగదా మినుకులీనును! ఒక్కొకపుడు కవినుడువులు ఉడురాశిని బురుడించును. ఇంకొకప్పుడు కవితలపులు పండుటాకులలోని సమీరవల్ల ధ్వని గుసగుసలవలె రంగురంగుల తేటమాటలందు కర్ణగోచరమగును. ఈపలుకు లెంత చక్కగనున్నవో పరికింపుఁడు:—

"గీతామృతమునంత - గిలకొట్టినావే"

"రాళ్ళ నీ తేల్చిన - రామనామపు చలువో!"

"మల్లెపువ్వు వాసనలు - కొల్లగా విసరితే"

"తాలురువ్వెడివారి - పూలపూజించెడి
మానవాతీతుడే - మామహాత్మాగాంధి"

"రాటముగొని యా - రాటముడిగి పో
రాటములేకను - పొంది సుఖింతము"

"షయిడికడియముకాలు-పట్టి తొడిగేవంట"

"నలువరాణీ నాడు - నాట్యమాడిన సభలో"

"ఏటిస్నానము నీకు - కోటిఫలమిస్తేను
నీటికాకియె మేలు - మనసా!"

"కరము చాచాడంటె - కనకమయవర్షమే"

"కనులెదుట నీలాల - కొంతు లెగజిమ్మ నీ
కమనీయమగు రూపు - కనురెప్పలలొ దాచి
కనులు మూసేసరికి,కటిక చీకటి గ్రిమ్మ
కంటిపాపలొ సీతతో
రామయ్య
కాపురము చేయవేరా!"

"కదపరా! అమృతంపు - కాలువలు ప్రవహించు"

"భావాలు పరుగెత్తెరా! నామనో - భావమున నిలిచిపోరా!"

"భక్తితో వరమడుగవే! తలనున్న - భాగీరథిని పంపునే!"
"మాటలు బహుమోటు - మనసు చల్లనిది"
"పిడుగుకైదువులేసి - పుడమి నెల్లెడల"
"పూవులకు రంగులను - పులుముచున్నావో!
చీకటే వెలుగులను - చిమ్ముచున్నావో!
నదులకూ నడకలను - నేర్పుచున్నావో!"
"ప్రేమచేతనే - పగతుని గెలుతము
రక్తపాతములు - రాక్షసమతమగు"

దైనికసమస్యనుండి దూరముగ తొలగిపోడుగాని తనయిహపరములు వానియందే అడగియున్నవని కవి తలపోయడు. పదుగురతో మన్నుపై నిలచియుండునుగాని మిన్నుపై నీతఁడు దృష్టినిబద్ధ మొనరింపకమానడు. కవి బ్రతుకును బేహారివలె వీక్షింపడు. లాభనష్టములందు తక్కెడత్రాసులందు నిఱుకుకొనడు. అక్కఱగాంచి కొలబద్ద చేఁబూని తూచాతప్పని లెక్క చూచి మనుగడ గడపడు. గంజిమెతుకులనే యాశించువాఁడు చిట్టా జాబితాలందు కైదీయై పడియుండడా? మనుష్యాంతరంగము కూటికై పాగులు పొట్టమాత్రమే కాదు. అన్నపుకరడులను కాక ఆత్మ అమృతంపు గుక్కలను కాంక్షించును. ఈశ్వరమహిమకై గుక్కిళ్లుమ్రింగును. పరమాశయములకై తపించును. సంచలితాత్మగల తపసియే కవియగును. చలించు నాత్మకు భూమ్యాకాశములును, స్థలకాలములును అడ్డుగట్టులుగావు. త్రిభువనసంచారియై కవియొరులెఱుఁగని దివ్యసామగ్రిని నిజాంతరంగమున కూడఁబెట్టుకొనును. ప్రత్యక్షజీవనమునకు పనికిరాదని ఒరుల ఈసడింపులకు కనలి దీని నీతఁడు పెంటపాలు చేయడు. హృదయకల్హారము నాశ్రయించిన భావమానసౌకములను దూరముగ గొట్టివేయడు. తనపంచయందే పడియుంట మంచిదనియెంచి, మేఘడోలికలం దూఁగాడు మనసును వెన్కకుతఱుమడు. ప్రయోజనముగాక ప్రమోదమే వీనియెడంద నాకర్షించును గావున, ప్రాణ

యినికై పొగులు పతిపగిది, దానికై స్వేచ్ఛమెయి ఈతఁ డెల్లెడల విహ రించును. కావుననే కవికుమారుఁడు సర్వలోకములందు ప్రీతకాప్తై యుండును. ఈతని దృక్పథమును, ఈతనిగమనిక నెఱిఁగిన వారు పరమ హంసబోలు ప్రత్యేకజీవియని భూతలమున నవతరించిన గంధర్వుఁడని వీనికి జోహా రందురు. తక్కుంగలవారు అక్కఱకుమాలిన ఘోషయందుఁబడి సుఖసంపదల నెఱుఁగని అభాగుఁడని ఈతని గేలిచేయుదురు. ఎవ్వరే మనిన నేమి, తన భావనావీథియం దీతఁడు పూలరంగఁడై వెలయును.

ఈయంశములన్నియు గ్రంథకర్తపట్ల జెల్లును. మహాకవుల నెల్లర వలె నైహికవాంఛల, భోగభాగ్యములనొల్లక ఆదర్శజీవియై ఈకవి మహా దాశయములను గీర్తించుచుంట ఆంధ్రలోక మెఱుఁగును. వీరిపాటలలోని మధుకణములం దెన్నో భావమహోదధు లుంటగని, బహుళమానసములు వానియందు గ్రుంకులిడునని విశ్వసించు,

చెన్నపురి,
3—7—1936.

సుధీవిధేయుఁడు,
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.



# మనవి



ఇప్పటి పాటల పుస్తకాలలో, గతానుగతికముగా పాటలకు స్వరములువ్రాయటం వాటిని అనుబంధముగాచేర్చ టం రివాజై పోయినది. గ్రంథకర్త పాడుకునే బాణీని తెలుసు కొని ఆప్రకారం పాడదా మనుకునే ఆసక్తిగలవారికి స్వరములు అవసరమే! కాని అట్టి ఆసక్తి అరుదై యెవరికితోచినట్లు వారు పాడుకోవటంకూడా మామూలు అయిపోయినది. పైగా స్వరములను చదువుకొని దానినిపట్టి సాహిత్యంసాగించే వారిసంఖ్య అత్యల్ప మనే సంగతి అందరికి తెలుసును. అందుచేత పాటలను స్వరపరచటం నిరుపయోగమని నాకుతోచి మాను కున్నాను.

నా మిత్రులు కొందరు యీ పాటలను అపరూపరాగ ములతో మేళవించి, క్లిష్టమైనన డకలతో పాడి నాకు వినిపించి నారు. పాడగల విద్వాంసులు పాడినప్పుడు శ్రవణానందముగా వుండకపోతుందా? కాని అట్లా పాడటం నాకు యిష్టములేదు. ఎందుచేతనంటే, ఆబాలగోపాలమునకు అందుబాటులో వుండ వలెననే ఆశయంతో వ్రాసిన పాట లివి. పిల్లలకు పామరులకు సులభముగా వుంటుందని వీధులవెంట భిక్షువులు పాడుతూ వుండే మామూలు పాటలదోరణి వీటికి వాడినాను.

చదువర్ల సౌఖ్యార్థము మరియొకమనవి చేస్తాను. పాట లన్నిటికిని సర్వజనసులభమైన "ముఖారి, నాదనామక్రియ"

ఈ రెండురాగాలలో ఒకటి సరిపోతుంది. పతాకగీతాన్ని "మోహన" తోను, మహాత్ముని సందేశాన్ని "చక్రవాకము" తోను నేను పాడుకుంటాను. తాళము ఆది, అట ఈరెంటిలో ఒకటి అన్నిటికి సరిపోతుంది. "భరతమాత, చెఱసాల" వీటికి "జంపె" సొంపునింపుతుంది.

"భరతమాత" రెండవ పాదములోని భావము మ. రా. శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులవారి "పూర్ణిమ" అను నాటకములో ఒకపద్యంలోనుండి గ్రహించినాను.

తొలిపలుకులను, అభిప్రాయములను వ్రాసి పంపిన మహాపురుషులకు నాహృదయపూర్వక నమస్కారములు. వారి అభినందనములను ఆశీర్వాచనములుగ భావించి, వారి వాక్యరాజములు నాకు వినయమును కలిగించ గలందులకు పరమేశ్వరుని ప్రార్థిస్తూవున్నాను.

పెరుమాళ్లపల్లి
వినుకొండ పోష్టు
౨౦-౪-౧౯౩౬

సబ్నివీసు గురునాథరావు,
గ్రంథకర్త.

# అభిప్రాయములు

ఆంధ్ర విశ్వకళాపరిష దుపాధ్యక్షులు,

శ్రీయుతులు

కట్టమంచి రామలింగారెడ్డిగారు, ఎం.ఏ. (క్యాంటబ్),
ఎం. యల్. సి.

DEAR SIR,

Your Collection of Songs :—

I read them with much interest. They are spirited pieces, which will have a good influence on our society and take it a step upward and forward.

I congratulate you on your forceful style and lofty thought.

CHITTOOR
16—7—35

Yours truly,
(Sd.) C. R. REDDY.

ఆంధ్ర వ్యావహారిక భాషా పితామహ,
మహోపాధ్యాయ, వ్యాకరణాచార్య, రావుసాహేబు,
గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు, బి.ఏ.యల్.టి.

............ మీరు రచించిన గీతములు అన్నీ చదివినాను. అన్నీ మనోహరముగా ఉన్నవి. మీరు అవి పాడుతూ ఉండగా వినే భాగ్యము నాకు కలుగలేదని చింతిస్తున్నాను............

ప్రతిపాటలోను ఏదో ఒక విశేషమున్నది. దేనిలోను లోటులేదు. జన్మభూమియెడలను, మాతృభాషయెడలను వాస్తవమయిన అనురాగము గల కవులు మీవలెనే గొప్ప భావములు, వాడుకమాటలతో, వినటానికి ఇంపుగా వుండేటట్టున్నూ, చట్టున మనస్సుకుఎక్కేటట్టున్నూ పాటలుగా రచించడము దేశముయొక్క భాగ్యమని నేను ఎంచుకుంటాను. "బాలకవి శరణ్యము"లో నేను వ్రాసిన కట్టకడపటి వాక్యము చిత్తగించండి.

"తెలుగుబాలకవులు కూడా బంగాళీవారివలె మాతృభాషాభిమానము కలవారై చక్కని కవితలు కూర్చగలిగితే, ఆబాలగోపాల మయిన అభినవాంధ్రసారస్వతము ఉదయిస్తుంది; దానివల్ల వారికీ, వారిభాషకూ, వారిసంఘమునకూ లోకములో గౌరవప్రతిపత్తులు కలుగుతవి; సంఘము యొక్క భాగ్యము కవిబ్రహ్మల చేతిలో ఉన్నది."

*    *    *    *    *    *

మీవంటివారు చేస్తూవున్న పనిచూచి నాశ్రమ వ్యర్థము కాలేదని సంతోషిస్తున్నాను. అనేక మంది పండితులున్నూ పరిషత్తులున్నూ మన మాతృభాషయందు ఆరోపించిన గ్రామ్యత్వదోషము అవివేక విలసితము. పండితులే, తాము మాట్లాడేభాష గ్రామ్యమని వాదిస్తారే, సిగ్గులేక; మరి గ్రామ్యముకాని "దేశభాష" దేశములో ఎక్కడున్నది? జన్మభూమిని వర్ణించినట్టే దేశభాషను కూడా కవులు వర్ణించి దానిమీద తమ అభిమానము ప్రకటించవలెను. త్యాగరాజు, క్షేత్రయ్య, సభాపతయ్య మొదలగువారందరూ వ్యావహారికభాషలోనేకదా పాటలు పాడింది!

పర్లాకిమిడి, 19-7-35.    (Sd.) వి. సే. గి. వెం. రామమూర్తి.

కృష్ణాపత్రికాధిపతులు,

మ. రా. శ్రీ ముట్నూరి కృష్ణారావుపంతులుగారును,

సుప్రసిద్ధ దేశనాయకులు,

డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులు,

బి. ఏ., యం. బి., సి. యం., గారును.

ఏభావాలైనా అవి ప్రాతవికానీ క్రొత్తవికానీ రాగాలలో, పాటల్లో, పదాలలో కొనలుసాగినగాని, అవి హృదయానికి పెనవేసికొనవు. అప్పుడు అవి ప్రజలసొమ్ములయి, దేశం మూలమట్టుకు కదులుతుంది. గురునాధరావుగారి పదా లట్టివి. ఇవి జనసామాన్యములో ఆనోటా ఆనోటాబడి కరగి ప్రవహిస్తే, గ్రామాలు పల్లెలు తిరిగి చిగిర్చి శోభిల్లుతాయి.

బందరు, (Sd.) ము. కృష్ణారావు.

23-4-35. (Sd.) భో. పట్టాభిసీతారామయ్య.

---

కవితావిశారద, ఉభయభాషా ప్రవీణ,

శ్రీయుత జి. జాషువగారు.

కవులును, నాకాబాల్యమిత్రులునగు శ్రీయుతులు గుర్నాధరావుగారి "గేయగుచ్ఛము" నామూలాగ్రముగాఁ బరిశీలించితిని. ఇందలి భిన్నకావ్యములు, ఇక్కాలపు ముత్యాల సరములను బోలి, లలితభావవిలసితములై మనోహరగమన గాంభీర్యముస నొప్పుచున్నవి. భావమును కప్పిపుచ్చక పాఠకున కవ్యయానందమును గలిగించు దివ్యఖండకావ్యములలో గేయగుచ్ఛమ గ్రస్థానము నలంకరించుచున్నది. వీరుగాయకులే గాక కవులునై భాషాసేవ జేయుచు, నాంధ్రులకృతజ్ఞతకుఁ బాత్రులగుట ముదావహము. వీరింక నెన్నియో కావ్యరాజములను సృష్టిజేసి క్రొత్తపోకడలం బోవ రసపిపాసువులు ప్రోత్సహింతురు గాక !

వినుకొండ,
15-6-35.

(Sd.) జి. జాషువ,
తెలుఁగు పండితుఁడు.

# గేయగుచ్ఛము



## ధ్యానము

కనులెదుట నీలాల - కాంతు లెగజిమ్మ నీ
కమనీయమగురూపు - కనురెప్పలలో దాచి,
కనులుమూసేసరికి - కటిక-చీకటిగ్రమ్మ,
కంటిపాపలో సీతతో
రామయ్యా
కాపురము చేయవేరా !!

౨

భక్షించుటకు మధుర-ఫలములను తెచ్చుటకు,
త్రాగుటకు మంచిపూ-దేనె సమకూర్చుటకు,
పాదాల పూజింప - పూలు తులసిని జేర్చ
భావాలు పరుగెత్తెరా!
నామనో
భావమున నిలిచిపోరా !!

## 3

అశ్రుజలములతోఁటి - అడుగుదమ్ములు కడిగి
ఆత్మలో నీమూర్తి - అమరించుకుందమని
ప్రకృతిలో లీనమై - పరికించినను నాదు
కనుల కగుపడ వేమిరా!
నాకర్మ
కలన మేమిటో చెప్పరా!!

---

# సందేశము

౧. కనకాభిషేకాలు - గండపెండారాలు
గొన్నట్టి మనకవుల - ఘనతలను వర్ణించి,
పాడరా! ఒకపాట - పరవశత్వము కలుగ
ఆంధ్రకవితాశక్తి - ఆంధ్రవిద్యార్థీ !!

౨. అజరామరంబైన - హంపీశిథిలములను,
అమరావతీస్థూప-మందున్న పనితనము,
చూడు మేకాగ్రతను - చిత్తచలనము కలుగు
ఆంధ్రుల శిల్పకళ - ఆంధ్రవిద్యార్థీ !!

౩. వెరపుడిగి, పల్నాటి - వీరగాథలలోన
ప్రవహించు, రక్తప్ర-వాహాలలో మునిగి,
జపియించరా! లేచి - జన్మ తఱియించునటు,
లాంధ్రుల పౌరుషం - బాంధ్రవిద్యార్థీ !!

౪. కొండవీడ్పురిగెడ్డ - కోనప్రాణములు నేడు
కత్తుల్లబావికడ - కదలుచున్నావిరా!
కరములను జోడించి - కన్నీరు గార్చరా!
ఆంధ్రశూరుల చూచి - ఆంధ్రవిద్యార్థీ !!

౫. వార్ధివిభునితోటి - వియ్యమందిన నాటి
దాత, రాయనమంత్రి - దానప్రవాహముల
దప్పి తీర్చుక యందు - ధన్యుండవై పాడు
మాంధ్రవదాన్యతను - ఆంధ్రవిద్యార్థీ !!

౬. రాగ, మనురాగమును - రక్తి, భక్తియు, ముక్తి
తన్మయత్వము నిచ్చు - త్యాగయ్యకీర్తనలు,
కదపరా! అమృతంపు-కాలువలు ప్రవహించు
ఆంధ్రుల గానకళ - ఆంధ్రవిద్యార్థీ !!

౭. రాణిరుద్రమ దేవి - రాజ్యమేలినయశము,
కాలగర్భములోన - కరిగిపోయినదిరా !
ఆంధ్రవనితలుగూడ - అవని నేలెదరంచు
అవనీస్థలికి చాటు - మాంధ్రవిద్యార్థీ !!

౮. తిమ్మరుసుకాలాన - తీగెసారిన బుద్ధి,
తుంగభద్రానదిలో - తూలి పడిపోయెరా!
దేహము చెమర్చంగ - దోహదం బొనరించు
ఆంధ్రులబుద్ధిలత - కాంధ్రవిద్యార్థీ !!

౯. నీజన్మ తెలిసికొని - నీచదువు చదువుకొని
నీకూడు భుజియించి - నీగుడ్డ ధరియించి
అభిమానధనుడవై - ఆర్యుండ వనిపించి
అతిశయింపగదోయి - ఆంధ్రవిద్యార్థీ !!

---

# భరతమాత

చలువగలిగిన మాత - సద్వంశసంజాత
మాతలందరిమాత - మా భరతమాత!!

౧. పరమపావనియైన - భరతమాతాకడుపు
చలువ వర్ణనచేయు - చిలువఱేనికికూడ
వశముగాకను నోదిగి - వసుధగర్భము దూర
మముబోంట్లు వర్ణించు -టమితహాస్యాస్పదమె!
చలువగలిగిన......

౨. మకుటమై వెలయు నా - మంచుకొండల చలువా!
మూడువైపుల నున్న - మున్నీటి చలువయో!!
గంగతల్లి మొదలు - కావేరివరకుగల
జీవనదులా చలువా! - దేవతల చలువయో!!
చలువగలిగిన......

3. అగ్నిపరీక్షతో - అనమాన యనబడిన
సీతామహాదేవి-పూతచరితపు చలువా!
గ్రామగ్రామమునందు- రామాలయపుచలువా!
రాళ్లనే తేల్చిన - రామనామపు చలువో!!
చలువగలిగిన......

౪. పతులె గతి యనియెంచి - పడరాని పాట్లు పడి
చచ్చియు బ్రతికియున్న - సాధ్వీమణుల చలువా!
వనమధ్యమున జేరి - వనజాక్షులను కూడి
వనమాలి యూదిన - వంశనాదపు చలువో !!
చలువగలిగిన......

౫. కాళిదాసుని బోలు - కవికుమారుల చలువా!
బుద్ధముని చేసిన - బోధసుధచలువో !!
తొల్లి గరుడునివలెను - తల్లిదాస్యము దీర్ప
తనువుతృణముగజూచు-మనగాంధిచలువయో!!
చలువగలిగిన......

౬. పాడిపంటల నిచ్చి - భాగ్యసంపద లిచ్చి
బిడ్డలను ప్రేమతో - పోషించుకొను చలువా!
ఇన్నిచలువలలోన - ఏచలువ సోకినదొ
కడమతల్లులకెల్ల - కన్నెరనై యొప్పు.
చలువగలిగిన......

---

# ప్రభుభక్తి

౧

భద్రములు చేకూర్చు - పరమేశ్వరుండా!
మారాజచంద్రునకు - ఆరోగ్యమిమ్మా!!
రవి కుంకలేనట్టి - రాజ్యమేలెడి మేటి
శాంతిసంస్థాపకుని - సత్పాత్రరత్నంబు
ధన్యు డైదవజార్జి-తనయుడౌ మారాజు
ఎనిమిదవఎడ్వర్డు - కెపుడు తోడ్పడుచును
ఆయుష్యమును - కూర్చుమా!
శాశ్వతై
శ్వర్యంబు - చేకూర్చుమా!!

౨

భద్రములు చేకూర్చు - పరమేశ్వరుండా!
మారాజచంద్రునకు - ఆరోగ్యమిమ్మా!!
నూటఒక్క-ఫిరంగి-వ్రేటుధ్వను లిట్టి సా
మ్రాట్టు లేడని తరిచి - చాటుచుండ యశంబు
మేలుమేలని వినుచు - మేరిరాణీ పొంగ
పట్టాభిషిక్తుడౌ - భారతనాధునకు
చిత్తస్థైర్యము - కూర్చుమా!
రాజ్యమును
చిరకాల మేలించుమా!!

3

భద్రములు చేకూర్చు - పరమేశ్వరుండా!
మా రాజచంద్రునకు - ఆరోగ్యమిమ్ము!!

రాము డేలినయట్టి - భూమిలోపల బుట్టు
భారతీయప్రజకు - ప్రభుభక్తి నైజంబు,
పాలకుల పాలితుల - ప్రేమ పెంపొందించి,
ఆనందమున నోలలాడుచుండగ, మాది
రామరాజ్యము చేయుమా!
మా; రాజ
రాజేశ్వరుని బ్రోవుమా!!

---

## బోధసుధ

అగ్రికులమున పుట్టి
అధికుండనైతినని
అదిరిపడబోకవే - మనసా!

కనులు రెండూ మూసి
కాలప్రవాహమున,
కెదు రీదకవె వెఱ్ఱి - మనసా !!

౨. హెచ్చుతగ్గులతోటి
పిచ్చియూహాలు చేయ
నచ్చదే యిప్పుడో - మనసా!

పరమార్థమును కోరి
బాగుపడు మను గాంధి
బోధసుధ గ్రోలవే - మనసా !!

3. జీవుడే దేవుడని,
దేవుడే జీవుడని
చిలుకపలుకులు పలికి - మనసా!

జీవులలో కొందరిని
చివరవారల చేయ
సిగ్గు లేదే వెఱ్ఱి-మనసా !!

౪. పంటకళ్ళములోన
పొలిగానినీ, నిలిపి
పాదరక్షలు కుట్టి - మనసా!

పాకీపనియు చేయు
పరమధన్యులు నేడు
పరమతముపాలైరి - మనసా!!

౫. గుడ్లు రెండును మూసి
కూర్చుండు నీకంటె
గుడ్డికొక్కెర మేలు - మనసా!

చిత్తశుద్ధి లేని
జప మేమి తప మేమి
చీదరింపకె వెఱ్ఱి-మనసా!!

౬. ఏటిస్నానము నీకు
కోటిఫల మిస్తేను
నీటికాకియె మేలు - మనసా!

రట్టుచేయక నీవు
గుట్టుగా హరిజనుల
పట్టు నిలువవె వెఱ్ఱి-మనసా!!

౭. పరవిద్యలను చదివి
పొట్టకూటికి నేర్చు
నట్టి నీ హెచ్చేమి - మనసా !

కాయకష్టము చేసి
కడుపు నిండించుకొను
కడవారి తగ్గేమి - మనసా !!

౮. అంటకూడ దటంచు
అంత్యజు డనుచునూ
గంతులేయకె పిచ్చి-మనసా !

అగ్రజన్మం బైతె
అంతరశత్రుతతి
అణచివేయవె వెఱ్ఱి-మనసా !

---

# అశ్రుతర్పణము

౧. నీకథలు చదువుకొని - నీపేరు తలచుకొని
నీమాట లాడుకొని - నిలువునా కూలెదము
తలచుకొనినంతనె - రాయలా !
తనువు
పులకరించును కృష్ణ-రాయలా !!

౨. కవితాపితామహుడు - కవితసరళిని దెలుప
పయిడికడియము కాలు - పట్టి తొడిగేవంట
కవిజనాదరణంబు - రాయలా !
నీతో
కడముట్టె శ్రీకృష్ణ-రాయలా !

3. నలువరాణీ నాడు -నాట్యమాడిన సభలో
నిలివెడెత్తు గడ్డి - నేడు చూడగవలసె
నుడువజాలను ఇంక - రాయలా !

కడుపు నీరౌ కృష్ణ-రాయలా !!

౪. కత్తినీ కలమునూ - గౌరవించా వంట
శరణన్న పగతునీ - చేరదీశా వంట
ఆంధ్రిలోకములోన - రాయలా !
నీ కీ
ర్త్యజరామరము కృష్ణ-రాయలా !!

౫. సర్వకళలను నీవు - సమముగా పోషించి
దేశమున విజ్ఞాన-తేజ మొనగూర్చితివి
అట్టివా రే రిపుడు - రాయలా !
దేశ
మొట్టిపోయెను కృష్ణ-రాయలా !!

---

# గాంధి

జీవితమంటే, నీదే గాంధి
నిన్ను
జీవన్ముక్తుడ వనగ చను కరుణాకంధీ !!

౧. దక్షిణాఫ్రికాదొరలు - దాక్షిణ్య రహితులై
ఈచెంపా వాయింపా - ఆచెంపా చూపించు
జీవితమంటే......

౨. గోక్లేమహాశయుని-గుడ్డ లుతకగ అతను
"మంచిచాకలి" వనిన మించి యుప్పొంగిన
జీవితమంటే......

౩. అంటరానితన - మంటె కంటగించి
శుష్కోపవాసములు - సలిపి సగమౌచున్న
జీవితమంటే......

౪. భార్య ప్రసవించితే - పరులా నాసింపాక
పరువునష్టమనక - పురుడు బోసికొనిన
జీవితమంటే......

౫. కలకత్తాకాంగ్రెసులో - వలయు వసతులు లేమి
గని పాకీపని చేయు - డని యాపని బూనిన
జీవితమంటే......

## రాధ వేడికోలు

నీవు నీవుగనుంటె - నిందబడయాలి
నింద పోవాలి నే - నంద మియ్యాలి.

౧

నీచూపులో నేను - నాచూపులో నీవు
నీచూపు నాచూపు - నేనె చూడాలి
నింద పోవాలి నా - నడత తెలియాలి.

౨

నీ పేరులో నేను - నా పేరులో నీవు
నీ పేరు నా పేరు - నిలిచిపోవాలి
నింద పోవాలి నా - నిజము తెలియాలి.

౩

నీలోన నే నుంట - నాలోన నీ వుండు
నీవు నేనూ కలిసి - నేను కావాలి
నింద పోవాలి నే - నీటు గుండాలి.

౪

పూవులో తావివలె - పెంపుమీరాలి
పాలలో నీళ్ళవలె - కలిసిపోవాలి
నింద పోవాలి నే - నింగి ముట్టాలి.

౫

మాటలో ధ్వనివలెను - మెలగుచుండాలి
మీగడలో జిడ్డువలె - మిళితమవ్వాలి
నిందపోవాలి నా - నీతి తెలియాలి.

౬

రాధ మాధవుడంచు - మాధవుడె రాధంచు
భేదరాహిత్యమై - ఖేద మొదలాలి
నింద పోవాలి ఆ-నంద మొదవాలి.

---

# సూర్యుడు

౧

ఒంటిచక్రిముబండి - కుంటిసారథి తోల
మంటయాకారముతో - మింట నీ వరుదెంచ
కంటగించీ కలువ - కన్ను మూసిందీ !
కాంతుకోర కేమేమొ - కలవరించిందీ !!

౨

కడులాలనగ నీవు - కిరణకరములు చాచి
కోడిగముతో పట్టి - గిలిగింత పెట్టగా
కదలిపోకు మటంచు - కమల పలికిందీ !
కలకాల ముండు మని - కలవరించిందీ !!

---

# పశ్చాత్తాపము

౧

కోడెలను మేపుకొని
గ్రామప్రభ కట్టుకొని
భత్యాలు చేసికొని
బాజాలు కూర్చుకొని
కోటప్పకొండకూ వెడదామా!
కొండచుట్టూ పరుగు లిడదామా!
కోనేటిలో మునక లేద్దామా!
కోటయ్యకూ కానుక లిద్దామా!!

౨

హరిజనుల నందరిని
హరుగుడికి తోడుకొని
పాలలో నీళ్లవలె
కలిసిమెలిసీ మనము
శివరాత్రి జాగరణ చేద్దామా!
శివశివా! యని భజన చేద్దామా!
హృదయార్పణము చేసుకుందామా!
ముదముతోడను ముక్తి గొందామా!!

## 3

పుట్టినప్పటినుండి
పట్టుబట్టీ మనము
అంటరానీ తనము
వెంటాడినందులకు

వగచి పాదాలపై పడదామా!
విడనాడకను సేవ చేద్దామా !
అందరము హారపూజ చేద్దామా !
అతనిలో ఐక్యమై పోదామా !!

## ४

వెరిియూహాలు మాన్పి
వర్ణభేదము మాన్పి
సర్వజనసోదరత
సాయించి సాదరత

పాపాలు మన్నించ మందామా !
పరమార్థ మిప్పించ మందామా !
పాదాలనూ బట్టుకుందామా !
బాష్పాలు వర్షించుకుందామా !!

---

# మతము

భిన్నరూపము లెత్తవలదే !
ఓ మతమ
భిన్నముగ మము చేయవలదే !!

౧

కష్టాలు అనుభవించామే !
ఇపుడు
కలవరము తెలిసికున్నామే !!
కలిసిమెలిసీ యుండెదామే !
ఇంక
కాకులల్లెను మెలగుతామే !! ...భిన్న

౨

ఆచారమును మార్చుకొనుమా !
లేకున్న
అగచాట్లు మేము పడగలమా !!

అన్యులము యెన్నడును కామే !
మేము
అందరము అన్నదమ్ములమే !! ...భిన్న

౩

దూరంబుగా వుంచుతావా !
మమ్మ
దూర దూరుల చేయలేవా !!
దురితంబు మెడగట్టుతావా !
నీవు
దూరదృష్టిని చూడలేవా !!...భిన్న

౪

ఒక్కచోటను పుట్టినామే !
మాకు
ఒక్కమ్మ ఒక్కయ్యయేనే !!
ఒక్కచోటను పెరిగినామే !
మేము
ఒక్కచోటికి పోయెదామే !!...భిన్న

౫

దేవు డందరివాడు కాడా?

అతడు

దర్శనము కొందరికి నియడా?

దీనులంటే నీకు తంటా?

కాకుంటె

దేవళము నీయబ్బగంటా !!...భిన్న

౬

ఎందుకూ యీకుళ్లు బుద్ధీ!

పైవారు

ఎగతాళిచేయుట నిబద్ధీ!!

సమదర్శినిగ యుంటబుద్ధీ !!

కనుము

సర్వేశ్వరుని మతము అద్దీ !!...భిన్న

---

# నిట్టూర్పు

నా దేశ మెట్లుండినాదో !
ఆనాడు
నాభాగ్య మెట్లుండినాదో !!

౧. ప్రజల బాధలుచూడ
ప్రచ్ఛన్నముగ నిశల
పదచారులై, భూమి
పతులు, తిరిగిననాడు...నా దేశ.

౨. పత్రములు లేకుండ
బాకీల నిచ్చుచును
సూర్యచంద్రులు, మనను,
సాక్షు లనుకొనినపుడు...నా దేశ.

౩. మగువలెందరో, వీర
మాత లౌదామనీ
వీరరసమున ఉగ్గు
నూరిపోసిననాడు...నా దేశ.

౪. పరులకొరకు దధీచి
ప్రాణములకు తెగించి
వెన్నెముక నిచ్చిన
వెనుకరోజుల్లోను...నా దేశ.

౫. భార్య చేతులు కాలి
పాచకుని తెమ్మన్న
"ప్రజకు భృత్యుడ" నంచు
♦ ప్రభువు పలికిన నాడు...నా దేశ.

౬. కయ్యమున కొమరుడూ
కొనప్రాణమున నుండ
"కదన యజ్ఞము" * మాత
వదలిరా ననినపుడు...నా దేశ.

♦ నాసిరుద్దీన్ మహమ్మద్:— ఈతడు బానిసవంశపురాజులలోని అల్తమష్ కుమారుడు.

* రాణీదుర్గావతి:— గడామండల సంస్థానాధిపతియగు గోండు రాజుభార్య.

# మట్టి

౧

పెద్దయెండకు నిలిచి
పెనుగాలికీ నిలిచి
పదను వానకు నిలిచి
ప్రళయానికీ నిలిచి

పరమేశ్వరుని చేర బిలిచావా !
పర్ణశయ్యను పాల బరిచావా !
పండబెట్టీ చిచ్చిగొట్టేవా !
పాటబాడీ నిదురబుచ్చేవా !!

౨

పెద్దబరువుతో నిలిచి
పైపైననే నిలిచి
పరమహంసగ నిలిచి
పరమార్థముగ నిలిచి

పరుల తనవలె చూడ మన్నావా !
బుద్ధమూర్తిని చేరబిలిచావా !
ప్రేమతత్వము నూరిపోశావా !
ప్రపంచకము నుద్ధరించేవా !!

3

అణుబీజమున నిలిచి
అమృతాంశువులో నిలిచి
అడవిలోపల నిలిచి
అన్నిచోటుల నిలిచి

అంటుగట్టుక జడల పెనిచేవా!
అసమానభూతదయ చూపేవా!
ఆశపాశము గోయ మన్నావా!
అవినీతినీ విడువ మన్నావా!!

—

మా

సిగ్గొచ్చి మనసేమొ - చిన్నబోయిందీ,
మతికుదిరి మనిసికే - మారుపొచ్చిందీ.

౧

సింగారముగ నేను - సీమగు డ్డేసుకొని
చెట్టుకిందీకెళ్ళి - సోమరిగ కూర్చుంటె,
సాలీడు పడుగునూ- సరిచేసుకున్నపుడు...సిగ్గొ

౨

సతితోను పోట్లాడి - సానింటి కెడుతుంటె
మనిసికై నాలేని - మంచిబుద్ధికతోటి,
గువ్వజత చెట్టుపై-కులుకు చూపెడుతుంటె...సిగ్గొ

3

బయట పక్కేసుకొని - పండి నిదరాబోయి
పొద్దున్న లేచుటకు - బద్ధకముతోచగా,
పిట్టలన్నియులేచి - పీచుపీ చనుచుంటె...సిగ్గొ

౪

పట్టెడన్నామనుచు - పంచముడు రాగాను
బాపనిల్లని నేను - పోట్లాడి పంపగా,
పశువులన్నియుకలిసి-పూరి మేస్తుంటేను...సిగ్గొ

౫

పేకాడుటకు, చేత - పైసైనలేకుంటె
పొలమమ్ముటకు నేను - బేరమాడూచుండ,
చీమకన్నములోకి - చిరుగింజచేర్చగా....సిగ్గొ

౬

విద్యచెప్పుమటంచు - వటుడొకడు వేడగా
వల్లకాదని నేను - తెల్లవదమూ పాడ,
మల్లెపువ్వువాసనలు - కొల్లగా విసిరితే
సిగ్గొచ్చి....................

---

# చెలిసాల

ప్రేమమయుశాలు మా
భారతీయుల యెడల
శ్రీహరి గన్న మా
చెలిసాల తల్లీ !!

౧

ఏనాడు పుట్టినదో?
ఏడేడ పెరిగినదో?
ఎవరు తలిదండ్రులో?
ఏఘనుడు భర్తో?

దుర్నీతి పరులకును
దుఃఖమయముగతోచు
దేశభక్తుల కీమె
దివ్యదర్శన మిచ్చు... ప్రేమ

౨

కులభేదములులేని
కలుపుగో లుత్తమ,
ప్రాతకాలపునాటి
పండుముత్తైదు

దీపానికై ననూ
దోవలే నిల్లాలు
కలియొ గంజియొ పోసి
కనిపెట్టు తల్లీ!!... ప్రేమ.

3

స్వచ్ఛందవాదులకు
స్వాగతం బర్పించి
శాంతిసత్యములనూ
చాదిపోసినదీ

బాలగంగాధరుచె
భాష్యంబు వ్రాయించె
బోసినోటయ్యనూ
పెద్దచేయించె !!

ప్రేమమయురాలు............

# భావభారతి

భావభారతి వచ్చి - పాటపాడిందీ
పాటలోపల ప్రేమ - ప్రజ్వలించిందీ

౧. భావభారతి వచ్చి - పాటనడకను చూప
మత్తేభములనడక - మందగించినదీ
శార్దూలము లన్ని - చెల్లు బట్టినవీ... భావ.

౨. భావభారతి వచ్చి - భావప్రకటన చేయ
కోకిలలపాటలో - గతి తప్పినాదీ
ఆటవెలదులయాట - అడుగంటినాదీ... భావ.

3. భావభారతి పాడి - పాటబింకముచూప
సీసములు మెత్తనై - చేవచెడిపోయె
కందాల కదలకా - గడ్డలైపోయె...... భావ.

౪. భావభారతిపాట-పదసమూహము చూచి
అర్ధానుస్వారములు - అట్టె వంగినవీ
ఇంద్రచంద్రగణాలు - ఇరువుమారినవీ.. భావ.

౫. భావభారతిపాట - పరికించంగానె,
చంపకోత్పలములు - చప్పబడినావీ
పాతకవులందరు - మూతి ముడిచేరు...
భావభారతి వచ్చి... ... ... ...

---

## మహాత్ముడు

ఎవరు దూషింతే నేమి?
మాహాత్ము
నెవరు భూషించితే నేమి?

౧. అవతారపురుషుడని
ఆదర్శప్రియుడని
దశదిశలు మారోగ్రి
ధన్యాత్ముడై నాడు... ... ఎవరు

౨. చూపు చూచే దంటె
సమ్మోహనాస్త్రమే!
కరము చాచే దంటె
కనకమయవర్షమే !!... ... ఎవరు

3. అవ్యాజమగు ప్రేమ
అంతులేని ప్రేమ
కళ్లజంటానుండి
సుళ్లుతిరుగుచు పారు... ... ఎవరు

గేయగుచ్ఛము

౪. పండంటి తలలోన
కొండంత యూహలు
ఎండిపోయిన తనువు
బండపగిలెడి పట్టు... ... ఎవరు

౫. మంచుగడ్డావంటి
మచ్చలేనీమనసు
సూర్యకిరణమువలెను
సూటితప్పని నడత... ... ఎవరు

౬. అతిమృదులమేగాక
అమితబహిరంగము
ఆకాశమును బోలు
ఆయంతరంగము... ... ఎవరు

౭. రాల రువ్వెడివారి
పూల పూజించెడి
మానవాతీతుడౌ
మా మహాత్మాగాంధి... ... నెవరు

---

# దేశోద్ధారకుడు

దేశోద్ధారకు డంటె చాలండీ!
తెలుగు దేశీయుల
దేహములు పులకించు, నమ్మండీ !!

౧. ఆంధ్రపత్రిక యిచ్చినాడండీ
ఆంధ్రవ్యక్తిత్వం
బాంధుర్లకు కలిగించినాడండీ !!
ఆంధ్రయౌన్నత్యంబు తెలియని
ఆంధ్యమును పోగొట్టి, నిత్యము
ఆంధ్రజనవ ల హృదయవీథిని
సాంద్రముగ వ్యాపించెనండీ !! ...... దేశో.

౨. రాజకీయములందె కాదండీ!
అన్నిటిలోగూడా
పూజనీయుండగుట నిజమండీ !!
అడుగుపట్టిన, లలితకళలను
నడుముగట్టుక పైకి తీసియు
ఆశ లుడిగిన యాంధ్రజనముల
వశముచేసిన కుశలుడండీ !! ...... దేశో.

3. విశ్వదాతని, యిచ్చె బిరుదండీ !
ఈతనికి గాంధీ
శాశ్వతప్రయశ మొసగినాడండీ !!
తెలుగు దేశమునందు యీతని
కలిమి కలియని సంస్థ లేదని
నలుగురికి తెలియుటచె, కలియు
బలి యనగ సార్థకమె నుండీ !! ... దేశో.

4. నోచిపుట్టిన పుణ్యశాలండీ !
పైసైన చేతిలో
పాచిదరిద్రము నిలువబోదండీ !!
విత్తమార్జించుటకు పూనిన
మిత్రియే లేదనగ కూర్చును
దానమిచ్చెడి వేళలం దవ
సాన దశ యూహించు నండీ !!... దేశో.

5. త్యాగి యగునన, తగిన దేనండీ !
నిజము కనుగొంటే
భోగిమాత్రము కాదు నమ్మండీ !!
వేళకన్నము నిదరియును, అను
కూలపడమిని పరిగణించక
సంతతము సంప్రీతితో పర
హితముకై పాటపడునండీ !! ... దేశో.

౬. శేషునంశము కలదు నమ్మండీ!
నాగేశ్వరునకు
సహస్రముఖములు, కలవు చూడండీ!!
లెక్కగూర్పగ మిక్కుటంబౌ
పెక్కువ్యాపారముల జిక్కియు
సొక్కి యేమరుపాటు చెందమి
యక్కజంబుగ దోచునండీ!!... దేశో.

౭. ఆలుబిడ్డలకొరకు కాదండీ!
పూటభత్యమునకు
సోలదైతే వెళ్లి కొల్లండీ!!
పొట్టజరుగక కాదు, కనుపడు
నట్టి మనలోపముల దీర్చుచు
దేశహితముకు తనువు నిచ్చెడి
యాశ కీ కామాట మండీ!!... దేశో.

౮. ఈదశయె స్థిరపడును చూడండీ!
నాగేశ్వ రాప్రుకు
ఈశ్వరుడె జయమిచ్చు నమ్మండీ!!
పెట్టినందుకు పుట్టుటయెనని
గట్టిగానూ తెలిసియుండగ
ఎటుల మారునో, భావిదశయని
తలుకుపడ పనిలేదు సుండీ!! ... దేశో.

౯. ఎన్నంబ్లి సభ్యత్వమును గనెనండీ !
మన స్వేచ్ఛకై
నిస్సంశయముగను, పాటుపడునండీ !!
కృష్ణగోదావరులవారి య
దృష్టమేమని పొగడవచ్చును,
స్వార్థరహితుని కోటునిచ్చి, కృ
తార్థతను గాంచితిరి సుండీ !! ... దేశో.

౧౦. ఎందరో కొండాడినారండీ
నిజ త్యాగికీర్తన
మందరికి విధ్యుక్తమేనండీ !!
అతిశయోక్త్యనుమాట చేర్చక
మతికి నిజముగ దోచు యీతని
గుణగణము గానమొనరించీ
గణ్యతను గాంచితిమి సుండీ !! ... దేశో.

---

# మహాత్ముని సందేశము

వినుడి వినుడి, ఓజనులారా !

విని

ధన్యతనొందుడి, జనులారా !!

పతితపావనుడు - పురుషోత్తముడగు

గాంధిమహాత్ముని - ఘనసందేశము

౧. ఖద్దరు కట్టుడి - జనులారా !

మన

కలిమిబలము లది - జనులారా !!

రాటముగొని యా-రాట ముడిగి, పో

రాటములేకను - పొంది సుఖాంతము...విను

౨. పంచమజాతిని - జనులారా !

మన

పక్షముగొందము - జనులారా !!

మతమనగను మన - యాత్మోన్నతికే !

మానవైక్యతను - మాప నేర్పడదు...విను

3. గ్రామోద్ధరణకు - జనులారా !
ఇక
గడగుదమండి, సు-జనులారా !!
నిష్పచ్చరముల-నిలయము లాయెను
పడినవృత్తులను - పైకి తీయుదము...విను

౪. చేతిపను లుడుగ - జనులారా !
మన
ఖ్యాతి నశించెను - జనులారా !!
హస్తనిపుణతను - ధ్వస్తముచేసిన
పరులచేతలకు - బానిసలగుదుము...విను

౫. శాంతము తగు, నో - జనులారా !
అది
శ్రేయమన్నిటను - జనులారా !!
ప్రేమచేతనే - పగతుని గెలుతము
రక్తపాతములు - రాక్షసమతమగు...విను

౬. సత్యమహింసలు - జనులారా !
మన
శస్త్రాస్త్రము లో - జనులారా !!
సమయము కనుగొని - సత్యాగ్రహమున
స్వాతంత్ర్యంబును - సంపాదింతము...విను

---

# వాన దేవుడు

వందనములు, వాన దేవరా!

నీరాక మా కా

నందమయ్యా, సామి దేవరా!!

చల్లనయ్యా నీవు లేచి
కొల్లగాను ధ్వనులు చేస్తూ
అల్లనల్ల నొచ్చినా, మా
ఒళ్లు పొంగి పోవునయ్యా!!...వంద.

౧. చెట్టుమీది చాతకంబునూ

ఓ వాన దేవా!

చేనులోని కాపువాడునూ

ఓరిమీతో నిన్ను తలచి

నోరు తెరచి మిన్ను చూచి

నారటంచు, వారినోట

నీరుపోసె దొరవు నీవు...వంద.

౨. మానవులకె కాదు మోదమూ
నీరాక యితర
ప్రాణులకును గూడ ప్రాణము
బండ క్రింది కప్పపిల్ల
కొండమీది నెమిలిపక్కి
కీరు కీరు మంటనుండు
కుంచవిప్పి యాడుచుండు...వంద.

3. నరుడు యెంత గడుసువాడోగా !
నీరాకకోరి
పరుగుచూపి, కొంపదూరుగా !!
అగ్గివంటి యెండలోన
యెగ్గులేక తిరుగులాడు
నెత్తిమీద చినుకు పడితె
మొత్తుకుంట, గుడిసెదూరు...వంద.

౪. మోడములతో మింటవెడలుమా !
తూనీగల, పై
యాడజేసి, ఆశగూర్చుమా !!
నెలకుమూడు వానలుండి
పొలములన్ని బాగపండి
పొట్టమాడె పేదను గని
పెట్టులే, మాభాగ్యమయ్యె...వంద.

౫. మైలుమేస్తు, కొండలుండాలి !
బీళ్లన్నికూడ
పొలపపారి, గడ్డిపట్టాలి !!
అరుగివంచకుండ గొడ్లు
పరుగిపరుగినాను మేసి
చంగనాలు తోలుతుంటె
పొంగిపొంగి పోదు మయ్యా ... వంద.

౬. పండిత వేదాంతు లల్లెనూ
తలలొంచుక, మా
పండినపై రుండవలయునూ !!
కంకిమానెదూగ పండి
చంక లెగుర నూర్చువేళ
వోలిపదము వినగ, మా
పాలేర్లుపాడ పబ్బ మయ్యా !! ...వంద.

౭. మండెడివేసంగిలోననూ !
మాయండనుండి
కుండపాడియుండ జేయుమా !!
బువ్వాకూ సరితూగుచల్ల
కవ్వమూ నెగగట్టకుండి,
బక్కనీళ్లు చిక్కనీవి
చిక్కనోళ్ళకే సెదాము ...... వంద.

౮. పక్షులాకు, పశువులాకునూ,
కిృమికీటకాది
పా్రణికోటి కెల్ల గూడనూ
నీదయుంటె రైతుబిడ్డ
ఆదరమున గటకనిచ్చి
దేశమంతటికిని, అతనె
పోషకుం డటంచు తెలుపు...వంద.

౯. మేడిపట్ట నేర్చినందుకూ
మాయేలినోడ!
కూడు కరవుచేసి చంపకూ
చెమటపట్ట, కొండ్రదున్ని
చల్లగాలి సుఖము తెలిసి
సౌఖ్యమూాగ దినము లీడ్చి
స్వేచ్ఛ యనుభవించెదాము...వంద.

---

## మొఱ్ఱ

౧. వాంఛించి మముగన్న, వినుకొండ సీమా!
వలనపోయెడిరోజు లొచ్చినవి తల్లీ !!
వెనుకరోజులలోన - విఖ్యాతిగన్నావు,
కోటలే గట్టితివి - గుడుల నెలకొల్పితివి,
కళల పోషించితివి - కావ్యాల నల్లితివి,
పరరాష్ట్రములదాక - ఫెల్లుమని వెలిగితివి,
కరవుకాలము వచ్చెనే!
మనకొరకు
కష్టాలు కాపుండెనే!

౨. వాంఛించి......
చినుకులే పడవాయె - జలవసతి లేదాయె,
కలుగజేసేవారు - కలికముకు లేరాయె,
దారిద్ర్యతాదేవి - తాండవించూటాయె,
గాదెలో గిద్దెడూ - గింజలే లేవాయె,
ఏరీతి యుండగలమో!
లేక యిపు
డే దేశ మేగవలెనో !!

౩. వాంఛించి......

అడవులన్నియు నేడు - ఆపదలలో నుంట,
ఇంటి ముంగలి గొడ్ల - కింత మేతయు లేక,
పాలాకు, వేపాకు - పచ్చి రేగాకులను
మేయగా కడుపులో - మంట లెత్తుటచేత,
"అంబ-అంభా" యంచు - అలమటించుచునుండ
మేమెటుల భరియింతుమో !
పశువులకు
మేత యెట్లు లభించునో !!

౪. వాంఛించి......

మాక్షోభ కేదైన - మార్గముండగ వచ్చు
పశుఘోష మాన్పగల - పుణ్యుడగుపడలేదు,
ఎండిపోయెను బావు, - లెండె చెరువులు, కుంట
లెండె వాగులు వంత, - లెండె మాగొంతుకలు,
నీళ్లు త్రాగుటకైన - నోచుకోనకుండ, యా
బ్రహ్మ నుదుట లిఖించెనో !
లేక, మా
పాపములె యిటువండెనో !!

గీ. వాంఛించి......

పాపపరిహారకుడు - భక్తజనపోషకుడు
ఆపదోద్ధారకుడు - ఆర్తజనరక్షకుడు
విశ్వహితమునుకోరి - విషముమ్రింగిన త్యాగి,
కొండపై మనకొరకు - కూరుచున్నాడమ్మ,

భక్తితో వరమడగవే !

తలనున్న

భాగీరథిని పంపునే !!

---

# మేఘుడు

తపనాంశు వేడిమికి - దహాతపం బొంది
తపియించి జనకుడు - తట్టువడుచుండ
జననమొందిన కష్ట-జన్ము డీతండు;
తలతోక యేర్పడ్డ - తరుణము మొదలు
చపలచిత్తునితోటి - జెలిమిని జేసి
జననభూమిని విడిచి - జనకుని విడిచి
భావగారిని విడిచి - భగినిని విడిచి
నవరత్నముల విడిచి - నాణెముల్ విడిచి
వేర్పడిపోయిన - వెఱ్ఱివా డితడు.

*          *          *

నీలాలకాంతులు - నలుదెసల్ జిమ్మ
తండ్రి సాన్నిధ్యంబు - తద్దయు విడిచి
తెలిమొగమ్ముల గోరి - తరలె నింగికిని,
పొరుగింట వండిన - పులుసాకె తనకు
రుచియను సామెత - రుజువుచేయుటకో !

*          •          *

పలుకరించెడి యిష్ట - బంధువు ల్లేక
ఆడుకొనుటకు మంచి - యం డేరు లేక

అంతరమధ్యాన - అల్లాడుచుండ
అచలము లీతని - కండగా నిలిచె,
అడవు లాయెను నలలి- తారామములుగ.

*   *   *

ఏమిసాధింపనో - యెరుగంగరాదు
నిరశనవ్రితదీక్ష - నిత్యముగబూనె
ఆహారమంటడు - అంబువుల్ దప్ప
అంబువులైనను - అరగించుకొనక
బుడబుడమనుచును - పుడమిపై గ్రిక్కి-
నిస్తేజుడై పోవు - నిమిషంబులోన.

*   *   *

భూలోకమునబుట్టు - పాణులకెల్ల
అత్యాదరంబున - అప్పులనిచ్చు
ఇచ్చినదిపుచ్చుకొన - యిరువుగానకను
తనమిత్రివర్యుడౌ - తపనునిబంపి
అనలువడ్డినిగూడ - అట్టెట్టుచేసి
పుచ్చుకొనుచుండెడి - బేహారి యితడు.

*   *   *

ఇందు్రినికొలువుకో - యీతడుద్యోగి
నీళ్ల కావడి మోయు - నిరుపేద యితడు

గడియ కోరూపాన - గనుపించునటుడు
మాటలు బహుమోటు - మనసు చల్లనిది;
ఆకాశవీధిని - యట్టహాసమున
తనఠీవి గనుడని - తిరిగెడివేళ
మెరపులసానిని - మెప్పించుకొంటకు
పిడుగు కైదువుఁలేసి - పుడమి నెల్లెడల
తనదెబ్బ కెక్కడ - తిరుగులే దనును.

*           *           *

ముత్యపుచిప్పలు - మూయించువాడు,
తూనీగలాటలకు - తలయూపువాడు,
కప్పకూతలు విని - కరగెడివాడు,
కేకకుల్కులకు, కే-కిస లేయువాడు.

*           *           *

ఆగ్రహ మూనిన - యారయం డెవని
గొల్లలు తనరాజు - కొలుపులుమాన
కార్చిచ్చు భంగిని - కనలి మిన్నంటి
చినుకులు బదులుగ - శిలలను గుప్పి
కృష్ణునంతటివాని - కంగారు పరచి
గోవర్ధనంబను - కొండ నెత్తించె.

*           *           *

బ్రహ్మదేవుడు నిద్ర - పోయెడి వేళ
పరమేశ్వరుడు చిన్ని - బాలుడగు వేళ
ఇను డంబుధుల నెల్ల - నింకించు వేళ
పవనుండు చెలరేగి - ప్రబలుడగు వేళ
భీకరాకారుడై - బిట్టల్క బూని
పటిమతో నల్ దెసల్ - పరవళ్లు ద్రొక్క
కాశికా విశ్వేశు - గర్భగుడి దక్క
ఉదకమయము జేసె - యుర్వియంతయును,
నిఖిల చిత్రాలకును - నిలయమై వెలసి
తలచిన మాత్రాన - తనువు పులకించు
సృష్టిసౌందర్యంబు - సున్న గావించి
"అదును ద్రొక్కుము, లెమ్ము - అజుడా !" యటంచు
తెల్లమొగ మేసుకొని - తరలె నెచ్చటికో !!

*   *   *



# కాంగ్రెస్ పతాకము

జై జై భారత-జాతి పతాకమ!

నిత్యజీవివై - నెగడు పతాకమా !!

౧. రంగుభేద మే-ర్పడుట తెలిసికొని

రంగులైక్యము జేయు-రాట్నపతాకమా!! జై జై.

౨. భిన్నలక్ష్యముల - ఖిన్నపడకుడని

ఏకలక్ష్య మే-ర్పఱచు పతాకమా !!... జై జై.

౩. కాయకష్టమును - కష్టసహిష్ణత

తగుననిదెల్పు యా-దర్శపతాకమా !!... జై జై.

౪. సర్వప్రాణులను - సమముగజూచెడి

శాంతిసమరమున-సాగుపతాకమా !!... జై జై.

౫. సత్య మహింసా - స్వాతంత్ర్యంబుల

సారరూపమగు-శాంతిపతాకమా !!... జై జై.

౬. భారతీయులకు - ప్రాణాధారమా

ఖదర్పతాకమా ! - కాంగ్రెస్పతాకమా !!

జై జై భారత - జాతిపతాకమ !

---

# పిలుపు

బ్రహ్మాండ భాండాల - పాలించు నేతా!
ప్రేమ స్వరూపుడా! - ప్రభువులకు ప్రభువా !!
ఈశ్వరా! రావోయి - ఈశ్వరా! రమ్మా
ఎచ్చోట నుంటివో - యెటుల నున్నావో!
నీవను లెరుగలేక - నిన్ను గనలేక
బానిసత్వముచేత - బాధ పడలేక
ఐశ్వర్యములు లేక - ఐక్యమే లేక
కూడు కడుపుకు కట్ట - గుడ్డయును లేక
సమకూర్చు కొనగలుగు - చదువులే లేక
అంధకారము నం - దదృశ్యమైతినిరా!
ఏ దిక్కు చూచినా - యెవరు లేరోయీ!
రావోయి రక్షింప - రావోయి తండ్రీ !!

*   *   *

సర్వస్వతంత్రుడా! - సచ్చిదానందా!
సంకల్పమున సృష్టి - సాగించు ఘనుడా !!
ఈశ్వరా! రావోయి - ఈశ్వరా! రమ్మా.
ఏ యణువులో చేరి - మెగురుచున్నావో
ఏ గుండెలో నిదుర - నేగు చున్నావో

పొట్టలో శిశువులను - పెంచుచున్నావో
గింజలలో చెట్లులను - గుంజుచున్నావో
పూవులకు రంగులను - పులుముచున్నావో
చీకటీ వెలుగులను - చిమ్ముచున్నావో
నదులకూ నడకలను - నేర్పుచున్నావో
పయము నొకచో రాశి - పోయుచున్నావో
తిన్నగా గోళాల - త్రిప్పుచున్నావో
పనులతో ఁదరచేత - పలుకకున్నావో
ఆపదలక్రింద నే - నణగిపోయితిరా !
రావోయి రక్షింప - రావోయి తండ్రి !!

* * *

సర్వభూతములందు - సమదృష్టినిలిపి
కాచిబ్రోచుచునుండు - కరుణాసముద్రా !
ఈశ్వరా ! రావోయి - ఈశ్వరా ! రమ్ము.
భర్మహర్మ్యాలకడ - పటకుటీరాల
కాంచనాంబరులకడ - కౌపీనధరుల
కోటీశ్వరులచెంత - కటికపేదలను
భోగలాలసులకడ - పాద సేవకుల
కల్పించి మమ్మిట్లు - కష్టపెట్టెదవా !
సర్వసముడను పేరు - సార్థకమెయైనా

దీనులను కాపాడు - దీక్ష నీకున్నా
రావోయి రక్షింప - రావోయి తండ్రి !!

* *

మాత్సర్యములు లేక - మతములే లేక
అల్లారుముద్దుగా - ఆర్యులుండగను
మధ్యకాలపు నరులు - మంతనము జేసి
ఆనాటిస్థితిగతుల - కనువైన రీతి
చుక్కలన్ని మతాల - సృష్టించినారు.
ఆనాటి పీనాడు - అంటియుండుటచే
దేశంబు చెడిపోయి - తెంపులగుచుండా
ఏలరా యీమతము - లేమిచేయుటకు?
ఎవనుద్ధరించుటకు? - ఎవని బాగునకు?
సృష్టికంతటి కొక్క - సూర్యుండు తగును,
తల కొక్కతరమైన - దగ్ధంబుగారే !
దేశాని కొక భాష - తగియుండుగాని
మనిషి కొకబాషైన - మాటాడగలరే?
పెక్కుమతములు యున్న - బాధయగునోయీ !
ఒక్కమతమే చాలు - యొద్దికతోనుండ
జీర్ణమై భ్రష్టమై - చెదిరి ఖండములై
హీనమై పోయిన - హిందుసంఘమునూ !

పునరుద్ధరించుటకు - బూనుకొనుమోయీ!
ఈమతభూతాల - నీడ్చివేయోయీ!
అవమానమును దీర్చి - యాదరించోయీ!
రావోయి రక్షింప - రావోయి తండ్రి!!

*       *       *

పిలిచిపిలిచీ గొంతు - పగిలిపోయినదీ
చూచిచూచీ కనులు - సొనలు కారినవీ
గుండె గుబగుబమంచు - గుబ్బటిల్లినదీ
కాళ్లు గుడ్డలరీతి - కూలిపోయినవీ
జీవచ్ఛవంబనై - చరియించుచుంటీ
నలుగురిలో తలయెత్తి - సలుచుండగలనా ?
పరదేశజులరీతి - బ్రతుకంగగలనా ?
అగ్నిపరీక్షతో - నల్లాడగలనా ?
కరుణగలగుండెయో -కఠినంపుచట్టొ!
అమృతమయమో మనసు - హాలాహలంబో!
దరిజేర్చు హస్తంబొ? - దగ్ధపటలంబో?
కాకున్న మాపైన - కఠిన మెందులకు?
దీనజనములపాలి - దిక్కునే ననుచూ
సాధులకును పారి-జాతమేననుచూ
ఆపదలు గలవారి - కండ నే ననుచూ

నిర్భాగ్యులకు మంచి - నిధిని నే ననుచూ
గీతామృతమునంత - గిలకొట్టినావే !
కొండలెగిరేరీతి - గో పెట్టినావే !
నరుడు నమ్మెడిరీతి - నచ్చబలికితివే !
మాటదక్కించుకొని - మమ్ముకాపాడూ
భారతీయుల బాధ - పరికించుమోయీ !
దయచేసి మాకింత - దారిచూపింపా
రావోయి రక్షింప - రావోయి తండ్రి !!

---

# ప్రార్థన

౧. స్మరణమాత్రముచేత - సంతుష్టి పడెదవని
విజ్ఞులెందరో చెప్ప - విని సత్యమని నమ్మి,
రామ శ్రీరామ రఘు - రామ యని ధ్యానింతు
స్వామి యాలించవయ్యా !
నాజన్మ
సార్థకము చేయవయ్యా !!

౨. సందర్భమేలేని - సంతోష మిచ్చెదవు
ఉత్తరక్షణమునను - ఉలికిపాటున దిగులు,
చూలింతరుచులవలె - సాగి[illegible]బోకయ్యా
స్వాస్థ్యంబొసంగవేరా !
నామతిని
స్థంభింపచేయవేరా !!

3. కడతేరుపని కేను - కర్తననిపించునూ,
కానిపనులకు నీవు - కారణంబనిపించు,
అన్నిపనులకు నీవె - యాధారుడను జ్ఞాన
మెన్నటికి కలిగింతువో !
నాతండ్రి
ఉన్నదే తగ్గింతువో !!

౮. జందెమేసియు నీవు - జంకు కొంకూ మాని
శబరి కొరికిచ్చిన - శుద్ధ యెంగిలి పండ్లు
మురిసి మురిసీ నీవు - మ్రింగితివే కాని
మా కేల యా బుద్ధి నీ
ఇవ్వకను
మతభేద మేర్పఱచితో !!

౯. దాసజనులకు నీవు - దాసుండ వై యుండి
దాసజనులను పెట్టి - దాస్యంబు చేయించు
తగని పద్ధతి మాదు - తలకంట గట్టితివి
మా బుద్ధులను మార్చెదో !
లేకున్న
మామూలుగనె యుంచెదో !!



ఈ పుస్తకము వలయువారు :

సబ్నివీసు గురునాథరావుగారు,

వినుకొండ.

అని వ్రాసిన బడయగలరు.